సాహి

హిత్యము

అన్న

# ం పెట్టని చదువు

(నాటిక)

ఆర్. రామచంద్రారెడ్డి

య పబ్లికేషన్సు

కడప

10

# ముఖ్య పాత్రలు

1. రంగడు
2. శంకర్
3. గోపీ
4. జానకి

బడిపిల్లలు 9_10 సంవత్సరాల వయస్సు.

5. శంకర్ తండ్రి
6. గోపీ తండ్రి
7. జానకి తల్లి
8. బిచ్చగాడు

2/17 1



# అన్నం పెట్టని చదువు

—...—

(మామూలు తెలుగుదేశపు పల్లెటూరు వీధి, తెర యెత్తగానే)

రంగడు: (ప్రవేశం - నిశ్శబ్దంగా యేడుస్తూ, కండ్లు తుడుచుకొంటూ, మెల్లగా వచ్చి స్టేజి మధ్య నిలబడును. ప్రేక్షకుల నందరినీ నిదానంగా కలయ జూచి) మా యమ్మ...మా యమ్మ చచ్చిపోయింది. (బిగ్గరగా యేడ్చును. ఏడుస్తూ మాట్లాడును) మాయమ్మ చచ్చిపోయింది. అమ్మా...అమ్మా... ఆకలౌతూ వుంది...నిన్నట్నుండి అన్నం లేదు... అమ్మా...ఆకలి...

(పాట Without Orchestra)

యెక్కడ పొయ్‌నావే_అమ్మా యెక్కడ పొయ్‌నావే
ఆకలి ఔతూందే_అమ్మా ఆకలి ఔతూందే
అన్నం పెట్టీ సీళ్ళు పోసీ
దెవరమ్మా యిక యెవరమ్మా - నా
కన్నం పెట్టీ నీళ్లు పోసే
దెవరమ్మా యిక యెవరమ్మా

మనిషి 1: (ప్రవేశం-రంగని ఎగాదిగా చూస్తూ పోతూవుండును. రంగని దాటి ఒకడుగు ముందుకుపోయి, నిలబడి, రంగనివైపు చూస్తూ) యెవర్రా నువ్వు?

రంగడు: (ఏడుస్తూ) నా పేరు రంగడు.

మనిషి 1: రంగడైతే యేడ్చేదెందుకూ?

రంగడు: మా యమ్మ చచ్చిపోయింది.

మనిషి 1: మీ యమ్మ చచ్చిపోయిందా? (రంగడు వొనని తల పూపును) ఐతేమాత్రం యేడ్చేదెందుకూ? యేడిస్తే మీ యమ్మ వస్తుందా? పోఫో! (ముందుకు నడుస్తూ ప్రేక్షకుల వైపు తిరిగి) బుద్ధిలేని వెధవ (నిష్క్రమించును.)

రంగడు: (దిగులు ముఖంతో ఆ మనిషి పోయిన వైపే చూస్తూ) యేడుస్తే రాదూ?...నిజమే...పొద్దున్నుండి యేడుస్తూనే వున్నా. మాయమ్మ రానేలేదు...మరి-మరి-నాకు యేడుపొస్తూ వుంది. (యేడుస్తూ) అమ్మా - అమ్మా-

(పాట Without Orchestra)

యెంత యేడ్చినా రానే రావే
యెక్కడ వున్నావే-అమ్మా యెక్కడ వున్నావే
యెంత పిలిచినా పలకనె పలకవు
యెక్కడ పోయినావే - అమ్మా యెక్కడ
పోయినావే

మనిషి 2: (ప్రవేశం-వచ్చి రంగని కెదురుగా నిలబడి, రంగనివైపు చూస్తూ) యెవర్రా నువ్వు?

రంగడు: (కండ్లు తుడుచుకుంటూ, యేడ్పు గొంతుతో) రంగడు.

మనిషి 2: రంగడూ?-ఐతే యేడ్చేదెందుకూ?

రంగడు: (ఒక క్షణం ఆలోచించి) ఆకలి వేస్తూ వుంది.

మనిషి 2: యేడుస్తే ఆకలి పోతుందా? పోఫో. (ముందుకు నడుస్తూ, ప్రేక్షకులవైపు తిరిగి) తెలివి తక్కువ వెధవ (నిష్క్రమించును)

రంగడు : యేడుస్తే పోదు...నిజమే...ప్రొద్దున్నుండి యేడుస్తూనే వున్నా...ఆకలి పోనేలేదు ... మ‌_మరి_నాకు యేడుపొస్తూ వుంది_ (యేడుస్తూ) అమ్మా—ఆకలే—

(పాట Without Orchestra)

ఆకలి ఔతుందే
అమ్మా ఆకలి ఔతూందే
నిన్నటి నుండీ అన్నం లేదే
కడుపులో భగ భగ మంటూందే
అమ్మా ఆకలి ఔతూందే

అమ్మా _ ఆకలి_ అమ్మా_అమ్మా (అంటూ నేలమీద మెల్లగా పండుకొనును) అమ్మా_అమ్మా (మూల్గును)

బిచ్చగాడు :(ప్రవేశం - పాట పాడుతూ)

చెయండి బాబూ చెయండి బాబూ
దానం ధర్మం చెయ్యండీ
బీదకు సాదకు దానం చేస్తే
ముందటి జన్మకు మేలండీ

(రంగడు లేచి, కూర్చొని, బిచ్చగానివైపు చూస్తూవుండును.)

కొన్నది తిన్నది ఖర్చైపోవును
చేసిన దానమె శాశ్వతమూ
పాపం పుణ్యమె పొయ్యేటప్పుడు
వెంబడి వచ్చును తెలియండీ
చెయండి బాబూ చెయండి బాబూ
దానం ధర్మం చెయ్యండీ

(రంగని చూపి, పాట ఆపి, మాట్లాడును) యెవరు నాయనా నువ్వు?

రంగడు: నేను రంగని.

బిచ్చగాడు: యెందుకిట్ల వీధిలో కూర్చున్నావ్? జర మొస్తా వుందా?

రంగడు: (కాదని తల తిప్పి) ఆకలౌతా వుంది.

బిచ్చగాడు: (రంగని సమీపించి) నీ కెవరూ లేరూ? — మీ యమ్మ లేదూ?

రంగడు: మా యమ్మ చచ్చిపోయింది. (యేడుస్తా) నా కెవరూ లేరు.

బిచ్చగాడు: చ్చొచ్చొ-పాపం — యేడవాకు నాయనా — నేనూ నీవూ వొకటేలే. నాకూ యెవరూ లేరు. ఆకలైతే అడుక్కుంటాను; కడుపు నిండితే యే చెట్టు కిందనో ముడుక్కుంటాను - అంతే. యేడుస్తా కూచుంటే అన్న మెవరు పెట్తారు? లెయ్ లెయ్. జోలె వేసుకొని యింటింటికీ పోయి అడుగు-యెవరో వొకరు పెట్తారు. లెయ్ నాయనా, లేచిపో.

రంగడు: (బాధను సూచించే కంఠంతో) అడుక్కు తినమంటావా, తాతా?

బిచ్చగాడు: అడుక్కు తినకపోతే, పిలిచి యెవరు పెట్తారు నాయనా? లెయ్-నేను చేసే పనే నిన్నూ చెయ్ మంటున్నా.

రంగడు: (అనుమానంగా) అడుక్కోడానికి సిగ్గెయ్యదూ?

బిచ్చగాడు:(నవ్వుతూ) ఓరి పిల్ల సన్నాసీ! మాటలు నేర్చినావే సుమారుగా! సిగ్గుపడితే అన్నమెట్లా వస్తుంది? నీకీలోకం సంగతి తెలియక సిగ్గుపడుతున్నావ్ నాయనా! సిగ్గు లేనివాళ్లే ఈ లోకంలో సంపాయించేది. లెయ్ లెయ్. సిగ్గుపడకుండా పదిమందినీ అడుగుతూ వుండాల. సరేనా? (రంగడు అనుమానంగా, మెల్లగా, 'సరే' నన్నట్లు తల వూపును) నేను వస్తాను మరి. (రెండడుగులు ముందుకు పోయి, మళ్ళీ నిలబడి రంగని వైపు తిరిగి) యిదిగో, నీ పేరేమిటి? రంగడు కదూ! ఊఁ – రంగడూ, వూరక అడుగుతే యెవరూ పెట్టరు. నీ కాకలైతే మాత్రం వాళ్ళెందుకు పెట్తారు? ఒక మాట జ్ఞాపకం పెట్టుకో– దానం చేస్తే పుణ్యం వస్తుందని చెప్పు–అట్లైతేనే యేదో వొకటి యిస్తారు. అణా యిస్తే, అర్ధరూపాయ్ పుణ్యం వస్తుందని చెప్పు–(ముందుకు నడుస్తూ ప్రేక్షకుల వైపుతిరిగి) బేరం అంతా. (నిష్క్రమించును)

రంగడు: (బిచ్చగాడు పోయిన వైపే చూస్తూ వుండును. అర్ధ నిముషం అయిన తరువాత, పరధ్యానంగా - అంటే తనకు తెలియకుండానే - పాట మొదలు పెట్టును.)

(Orchestra లేకుండా)

బీదకు సాదకు దానం చేస్తే
ముందటి జన్మకు మేలండీ
పాపం పుణ్యమె పొయ్యేటప్పుడు
వెంబడి వచ్చును తెలియండీ.

(పాట క్రమంగా క్షీణించి, ఆగిపోవును: రంగడు ఆలోచనా రహితంగా ఆ వైపే చూస్తూ వుండును.)

మనిషి 3: (ఆ దిక్కునుండే ప్రవేశం)

రంగడు: (లేచి నిలబడి) అయ్యా, ఒక బొట్టు ధర్మం చెయ్ అయ్యా! (చేయి చాచును)

మనిషి 3: (రంగని వైపు చూస్తూ, పలక్కుండా, నిష్క్రమించును. అతను పోయిన వైపే రంగడు చూస్తూ వుండును. ఆ దిక్కునుండే 'మనిషి 4' ప్రవేశం)

రంగడు: బాబూ, ఒక బొట్టు దానం చెయ్యండి బాబూ, మీకు పుణ్యం వుంటుంది.

మనిషి 4: (లేదని చేయి ఆడిస్తూ, నిష్క్రమించును)

రంగడు: (అతను పోయినంత వరకూ అతని వైపు చూస్తూ వుండి, తరువాత (ప్రేక్షకుల వైపు తిరిగి) పుణ్యానికి కూడా గిరాకీ తగ్గిపోయింది. తాత చెప్పిన బేరం గిట్టేటుగా లేదు. (బాధపడుతూ) అబ్బా-ఆకలి. (రెండు చేతులతో కడుపు పట్టుకొని కూర్చొనును.)

స్త్రీ: (ప్రవేశం)

రంగడు: అమ్మా-ఆకలౌతావుంది. యేమైనా వుంటే యిచ్చి పోమ్మా - నీకు పుణ్య ముంటుంది.

స్త్రీ: (నిలబడి) నీ కాకలైతే యెవరు పెట్టార్రా? పోఫో! అడుక్కోకపోతే, యేదైనా పని చేసుకోకూడదూ!

రంగడు: (అమాయకంగా) యేం పనీ?

స్త్రీ: (వెటకారంగా) ఓహో! అదీ నేనే చెప్పాల్నా! (కోపంగా) ఫో-సోమరి వెధవా! (నిష్క్రమించును)

రంగడు: అమ్మా-ఆకలి. (యేడుస్తూ) అమ్మా! (నేలమీద పడిపోవును. క్రమంగా క్షీణిస్తున్న కంఠంతో రెండు మూడుసార్లు 'అమ్మా', 'అమ్మా' అనును. తరువాత నిశ్శబ్దం)

(అర్ధనిమిషం నిశ్శబ్దంగా గడచిన తర్వాత శంకర్, గోపీ, ఒకరి వెనుక ఒకరు పరుగెత్తుకుంటూ ప్రవేశం. ఇద్దరికీ భుజం మీద నుండి పుస్తకాల చిత్తులు వ్రేలాడుతూ వుంటాయి. స్టేజి మధ్యకు వచ్చేటప్పటికి, శంకర్‌ను గోపీ ముట్టుకొని)

గోపీ : ఆఁ — చిక్కినావ్. చిక్కినావ్.

శంకర్ : (రెండడుగులు ముందుకు పోయి, రంగని చూచి నిలబడును.) వుండరా గోపీ — యెవరో పండుకున్నారు చూడు.

గోపీ : (రంగని చూసి) ఔనా — యెవరో పాపం. (ఇద్దరూ రంగని దగ్గరకు పోతారు.)

జానకి : (పరుగెత్తుకుంటూ ప్రవేశం. చేతిలో పుస్తకాల చిత్తి వుంటుంది. స్టేజి ప్రవేశిస్తూనే) యేమిటి శంకర్ (వాళ్ళను సమీపించి) యెవరో !

శంకర్ : స్ — (మెల్లగా మాట్లాడును) గట్టిగా అరవొద్దు. వీధిలో పడి నిద్రపోతున్నాడు పాపం.

జానకి : పిల్లవాడేనే — యిక్కడెందుకు పండుకున్నాడో !

గోపీ : వుండు. (కూర్చొని రంగని ముఖం పరీక్షగా చూసి) అరె, రంగడే! (తలెత్తి శంకర్ వైపు చూస్తూ) శంకర్, రంగడు! (జానకి వైపు చూస్తూ) జానకీ, మీ క్లాసు పిల్లవాడే గదూ ? చూడూ.

జానకి : (కూర్చొని రంగని ముఖం చూసి) ఔను గోపీ, రంగడే — మా క్లాసు పిల్లవాడే — కానీ యీ మధ్య చాలా రోజుల నుండి బడికి రావడం లేదు.

గోపీ : బడికి రావడం లేదూ? అందుకేనేమో నాకు చాలా రోజుల నుండి కనిపించలా.

జానకి: గోపీ, చాలా మారిపోయినాడు గదూ? పాపం — చిక్కిపోయి నట్లుంది.

రంగడు: (మెల్లగా) అమ్మా (అని కదలును.)

శంకర్: వుండండి వుండండి — కదల్తున్నాడు (వాళ్ళ పక్కనే కూర్చొనును)

జానకి: అమ్మా అంటున్నాడు. పాపం, వాళ్ళమ్మ కు యేమైందో?

రంగడు: అమ్మా...అమ్మా... (కండ్లు తెరచి, మెల్లగా లేచి, కూర్చొనును. ముగ్గురినీ మార్చి మార్చి చూస్తూ వుండును. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడచిన తర్వాత)

శంకర్: రంగడూ — నేను — శంకర్‌ను.

రంగడు: (శంకర్ వైపు చూచును)

గోపీ: నేను గోపీని.

రంగడు: (గోపీ వైపు చూచును)

జానకి: నేను జానకిని.

రంగడు: (జానకివైపు చూచును. క్రమంగా కొంచెం కొంచెం జ్ఞాపకం వచ్చి) ఆఁ—నీవు జానకివి, (గోపీవైపు తిరిగి) నీవు గోపీవి, (శంకర్ వైపు తిరిగి) నీవు శంకర్. (అందరినీ మళ్ళీ ఒకసారి చూచి) మరి యిక్కడెందుకున్నారు?

(ముగ్గురూ ఒకరి ముఖాలొకరు చూచుకొందురు)

గోపీ: (రంగని వైపు తిరిగి) రంగడూ, ముందు నీ వెందుకున్నావో యిక్కడ చెప్పు.

రంగడు: (యేమి అర్థం కానట్లు గోపీవైపు చూచును)

శంకర్: నీ విక్కన్నే డోడ్డు ప్రక్కన పడి నిద్రపోతున్నావ్. అందుకనే మేమూ వున్నాం.

రంగడు: (నిదానంగా) నేనా_?

జానకి: ఔను రంగడూ – మేమొచ్చే టప్పటికి నీ విక్కన్నే నిద్రపోతున్నావ్. నిద్దల్లో అమ్మా అంటూ వుంటివే? మీ యమ్మ కేమైందో చెప్పవూ?

రంగడు: అమ్మా? (ఉట్టిపాటుగా జ్ఞాపకం వచ్చి బిగ్గరగా యేడ్చును) అమ్మా – అమ్మా.

(శంకర్, గోపీ దిక్కు తెలియక ఒకరి ముఖాలొకరు చూచు కొందురు)

జానకి: రంగడూ! (రంగని భుజం పట్టుకొని) యేడవొద్దు రంగడూ–మీ యమ్మ కేమైందో చెప్పు.

రంగడు: (వెక్కి వెక్కి యేడుస్తూ) మా యమ్మ–చచ్చిపోయింది.

జానకి: అయ్యో – పాపం!

శంకర్: మీ యమ్మ చచ్చిపోయిందా? (రంగడు యేడుస్తూనే ఔనని తల వూపును) మీ నాన్న లేడూ? (లేడని రంగడు తల వూపును) నీ కింకె యెవ్వరూ లేరూ? (లేరని రంగడు తల వూపును.)

గోపీ: ఐతే మరి యెట్లా?

జానకి: రంగడూ, నీకు అన్న మెట్లా మరి?

రంగడు: (యేడుపు గొంతుతో) నిన్నట్నుండి అన్నం లేదు.

జానకి: ఆకలైతా వుందా? (రంగడు ఔనని తల వూపును) మరి అప్పట్నుండి చెప్ప లేదే? వుండు (తన చిత్తిలో చేయి పెట్టి ఛాక్లెట్ బయటికి తీసి) యిదిగో ఛాక్లెట్ (ఛాక్లెట్ మీది కాగితం విప్పి) తిను. (రంగడు ఛాక్లెట్ నోట్లో వేసు కొనును.)

గోపీ: (శంకర్‌తో) ఛాక్లెట్ తింటే ఆకలి పోతుందా?

శంకర్: (ఒక క్షణం ఆలోచించి జేబులో నుండి ఒక అణా బయటకు తీసి) యిప్పుడే వస్తాను. (పరుగెత్తుకుంటూ నిష్క్రమించును.)

జానకి: శంకర్ అట్లు పరుగెత్తినా డెక్కడ గోపీ!

గోపీ: నీ ఛాక్లెట్ తింటే ఆకలి పోతుందా? (నవ్వుతూ) రంగ నడుగు.

జానకి: (రంగని వైపు చూసి, మళ్ళీ గోపీ వైపు చూస్తూ) మరి నా దగ్గర యింకేమీ లేదు. లేకుంటే మా యింటికి పిల్చుక పోతాన్లే-మా యమ్మ అన్నం పెట్తుంది.

గోపీ: శంకర్ రానీ తట్టుకో-తినడానకేదైనా తీసుకొస్తాడు.

జానకి: గోపీ (యేదో చెప్పబోయి ఆపును.)

గోపీ: యేం జానకీ? యేమో చెప్పు.

జానకి: గోపీ, (ఆలోచిస్తూ, నిదానంగా మాట్లాడును) రంగనికి - అమ్మ చచ్చిపోతే - అన్నం పెట్టేవాళ్ళూ- యెవరూ లేరు కదూ?

గోపీ: ఊఁ - ఐతే?

జానకి: మరీ - మనకూ అమ్మ లేకపోతే?

గోపీ: (అర్థం కాక) అంటే?

జానకి: నీకు మీ యమ్మా, నాకు మా యమ్మా లేకుంటే, మనకు అన్నంపెట్టే వాళ్లెవరూ?

గోపీ: ఊఁ? (ఒకక్షణం ఆలోచించి) మనకేం? నీకు మీ నాన్నా, నాకు మా నాన్నా వున్నారుగా?

జానకి: (కాదని తల తిప్పుతూ) ఊఁహుఁ_రంగనికి నాన్నగూడా లేదు గదూ ?

గోపీ: ఐతే ?

జానకి: అది కాదు గోపీ_మనకూ అమ్మా నాన్నా లేకుంటే యెట్లా అని.

గోపీ: (యెక్కడనో చూస్తూ, అదే మాటలు నిదానంగా వల్లించును) మనకూ – అమ్మా నాన్నా – లేకుంటే – యెట్లా? (దిగులుగా జానకి వైపు చూస్తూ) యెట్లా జానకీ ? మన కన్న మెవరు పెట్తారూ ?

జానకి: అదే గోపి – మన కప్పుడు అన్న మెట్లా ?

శంకర్: (వడివడిగా నడుస్తూ ప్రవేశం – ఒక చేతిలో రెండు అరటి పండ్లూ, మరొక చేతిలో ఒక నీళ్ళ గ్లాసూ వుండును, రంగని దగ్గర కూర్చుంటూ) యివిగో రంగడూ, యీ అరటి పండ్లు తిని నీళ్లు తాగు. ఆకలి పోతుందిలే. (నీళ్ళగ్లాసు క్రింద పెట్టి, అరటి పండ్లు రంగని కిచ్చును)

(రంగడు పండ్లు తింటూ వుండును.)

గోపీ: శంకర్, జానకి ఒకమాట చెప్తా వుంది – విను.

శంకర్: ఏం మాట ?

గోపీ: ఏం మాటంటే_మరీ_(జానకివైపు చూసి) నువ్వే చెప్పు జానకీ – నా చేత గాదులే.

జానకి: ఊఁహూఁ_నువ్వే చెప్పు.

గోపీ: ఊఁహూఁ_నాకు చెప్పింది నువ్వేగా? శంకర్ కుగూడా నువ్వే చెప్పు.

జానకి: అబ్బ! సరేలే_విను శంకర్. మరి _ రంగనికి అమ్మా నాన్న లేరుగదూ! అందుకని ఆకలైనా రంగనికి అన్నం పెట్టేవాళ్లు లేరుగదూ! మరి_మనకూ_డా_ అంటే నీకూ, నాకూ, గోపీకి _ ముగ్గురికీ _ అమ్మా నాన్నా లేకపోతే ఎట్లా? అప్పుడు మనకు అన్నమెట్లా?

శంకర్: ఊఁ_(గోపీవైపు చూసి, మళ్ళీ జానకివైపు తిరిగి, చిరునవ్వుతో) పిచ్చి ముఖమా! యెవరు చెప్పిరి నీకీ పిచ్చి పిచ్చి ప్రశ్నలన్నీ?

జానకి: (అమాయకంగా) యేం?

శంకర్: యేమీ! నీకు అమ్మా నాన్నా వున్నారు గదూ?

జానకి: ఊఁ (ఔనని తల వూపును)

శంకర్: గోపీకీ వున్నారు గదూ?

జానకి: (ఔనని తల వూపుతూ) ఊఁ.

శంకర్: సరే_నాకూ వున్నారు. ఇక యెందుకొచ్చిందీ ప్రశ్న?

జానకి: ఊఁ_(అర్థం కాక, అయోమయంగా గోపీ వైపు చూచును)

గోపీ: (ఆలోచిస్తూ తల గోక్కుంటూ) ఎందు కొచ్చిందీ?

జానకి: (హఠాత్తుగా జవాబు స్ఫురించి, శంకర్ మీద విసుగుతో) అబ్బ_అది కాదు శంకర్_యిప్పుడున్నారులే _ లేకపోతే యెట్లా అని.

గోపీ: అఁ_అదీ _ యిప్పుడేమో అమ్మా నాన్నా వున్నారు మనకు. లేకుంటే యెట్లా అని.

శంకర్: (నవ్వి) ఒకవేళ లేకుంటే యెట్లా అని_అంతే గదూ? (ఔనని గోపీ తల ఆడించును) వొరేయ్ గోపీ _ జానకే

పిచ్చిదనుకుంటే నీవింకా పిచ్చోదానివైనావే! ఇప్పుడు మన కందరికీ అమ్మా నాన్నా వున్నారుగా—లేనప్పటి సంగతి అప్పుడే చూసుకుందాంలే — యిప్పుడెందుకూ ఆ ప్రశ్నలన్నీ?

రంగడు: (ఇంతవరకూ వాళ్ళమాటలు వింటూ, అరటిపండ్లు తిని, నీళ్లు త్రాగి వుండును) యిప్పుడెందుకా? నేన్ చెప్పేదునా?

శంకర్: ఆఁ — చెప్పూ.

గోపీ: | జానకి: (యిద్దరూ ఒకేసారి) చెప్పు రంగడూ — చెప్పు.

రంగడు: మీ కందరికీ అమ్మా నాన్నా వున్నారు గదూ? (వున్నారని ముగ్గురూ తలల వూపుదురు) మరి నాకేమో అమ్మా లేదు, నాన్నా లేదు. నా గతి యెట్లా? (గోపీ, జానకీ, శంకర్ ముఖంవైపు చూస్తారు) నాకు రోజూ అన్నం యెవరు పెట్తారు? ఆ మాటే జానకి తిప్పి అడుగుతా వుంది. అంతేగదూ గోపీ?

గోపీ: (వికసించిన ముఖముతో) ఆఁ — అంతే —

జానకి: (ఉత్సాహంగా తల ఆడిస్తూ) యిప్పుడు చెప్పు శంకర్, యిప్పుడు రంగని సంగతి యెట్లనో చెప్పు.

శంకర్: (సందేహిస్తూ) రంగని సంగతా? (ఆలోచనలో పడును)

గోపీ: (ఎగతాళిగా) అప్పటి సంగతి అప్పుడు చూసుకుంటాడట—ఐతే యిప్పటి సంగతే చెప్పవోయ్ మిడతం భట్లూ.

శంకర్: శ్ వుండరా — రంగడూ, నీకు రోజూ యెన్నాళ్లు అన్నం పెట్టాల?

జానకి: యెన్నాళ్లూ! యెన్నాళ్ళయినా పెట్టాల్సిందే - బతికి వున్నాళ్లూ అన్నం తినరో యెవరైనా?

శంకర్: (విసుగ్గా) అట్లాగాదు జానకీ-చదువుకున్నన్నాళ్ళే గదూ రంగనికి అన్నం పెట్టాల్సింది. కొన్నాళ్లు చదువుకుంటే తరువాత తానే సంపాయించుకుంటాడు.

గోపీ: ఔ నిజమే - చదువుకుంటే రంగడు కూడా మనతో పాటే గొప్పవాడౌతాడు.

రంగడు: చదువుకుంటే గొప్పవాళ్ళవుతారా?

గోపీ: నిజం రంగడూ - చదువుకుంటే గొప్పవాళ్ళవుతారని మా అమ్మ చెప్పింది, మా నాన్న చెప్పినాడు, మా టీచరు కూడ చెప్పినాడు.

శంకర్: వొకరు చెప్పడ మెందుకురా? మనం చూస్తున్నాముగా! చదువుకున్న వాళ్లందరూ గొప్పవాళ్లయినారు.

రంగడు: గొప్పవాళ్ళంటే?

గోపీ: గొప్పవాళ్లంటే-గొప్పళ్లవాంటే-(చెప్పలేక, శంకర్‌తో) నువు చెప్పు శంకర్, గొప్పవాళ్ళంటే యెవరో.

శంకర్: గొప్పవాళ్ళంటే - వాళ్ళకు దండిగా డబ్బుంటుంది - మంచి మంచి గుడ్డలు వేసుకుంటారు-మరి యింకా-యింకా యేమంటే - ఆఁ - వాళ్ళకు కావలసినవన్నీ కొనుక్కుంటారు.

రంగడు: (జానకిని చూస్తూ) అంతేనా జానకీ?

జానకి: యేమో ? నాకేం తెలుసు ? అంతేననుకో.

రంగడు: గొప్ప వాళ్ళంటే డబ్బున్న వాళ్ళన్న మాట. ఐతే నాకే మొద్దులే మీ చదువు.

గోపి: | శంకర్: | (యిద్దరు ఒకేసారి) యేం ?

జానకి: యెందుకు రంగడూ, చదు వెందుకు వద్దూ ?

రంగడు: చూసినాంలే మీ గొప్ప వాళ్ళ నందర్నీ.

జానకి: యెప్పుడూ ?

శంకర్: యెక్కడా ?

రంగడు: యీ రోజే-ప్రొద్దున్నుండి యీ దోవన యెంత మంది గొప్పవాళ్లు పోయ్నారో-ఒక్కరూ వొకణా యిచ్చిన పాపాన పోలేదు.

(జానకీ, గోపీ, శంకర్ వైపు చూస్తారు.)

శంకర్: ఐతే యేమంటావ్ ? (రంగడు పలకడు)

జానకి: చెప్పు రంగడూ-నువ్వనేదేమిటి ?

రంగడు: చదువుకుంటే గొప్పవాళ్ళైతారు గదూ ? - అట్లైతే నాకా చదువూ వద్దు-గొప్పవాళ్లు కావడమూ వద్దు.

శంకర్: అంటే - గొప్ప వాళ్ళందరూ చెడ్డ వాళ్ళంటావ్ ? అంతేనా ?

రంగడు: (ఔనని తల వూపుతూ) అంతే.

శంకర్: అబ్బ! (విసుగుతో, రెండు చేతులతో తల పట్టుకొని) యీ రంగనికి మరీ పిచ్చి పట్టిందిరా దేవుడా !

జానకి: (శంకర్‌తో) నీ కెప్పుడు మాట్లాడేది చేతగాకపోతే, అప్పుడు మా కందఱికీ పిచ్చి పట్టిస్తావ్. నువ్వూర్కో. (రంగనివైపు తిరిగి) రంగడూ, యిటు చూడు. నేను మంచిదాన్నేనా ?

రంగడు: (ఔనని తల వూపును.)

జానకి: గోపీ మంచివాడేనా ?

రంగడు: (ఔనని తల వూపును.)

జానకి: శంకర్ మంచివాడేనా ?

రంగడు: (ఔనని తల వూపును.)

జానకి: మేమందరమూ మంచివాళ్ళమే గదూ ?

రంగడు: (ఔనని తల వూపును.)

జానకి: మరి మే మందరమూ చదువుకుంటున్నాం. బాగా చదువుకొని గొప్ప వాళ్ళమైపోతాం. అప్పుడు మేం మంచి వాళ్ళంగా వుండమూ ?

రంగడు: (మెల్లగా) యేమో? యీ వూర్లో గొప్పవాళ్ళందరూ చెడ్డ వాళ్ళే నే ?

జానకి: (లాలించే కంఠంతో) నన్ను నమ్మవూ రంగడూ ? నేను తప్పకుండా మంచిదాన్నిగానే వుంటాను.

రంగడు: (అనుమానిస్తూ) నిజంగా ?

జానకి: నిజంగా రంగడూ, ప్రమాణంగా—నాతోడు — నేను యెప్పుడూ మంచిదాన్ని గానే వుంటాను.

గోపీ: నేనూ అంతే _ దేవునితోడు _ నే నెప్పుడూ మంచి వాణ్ని గానే వుంటాను.

శంకర్: దేవునితోడు_నేనూ యెప్పుడూ మంచివాణ్ని గానే వుంటాను.

జానకి: యేం రంగడూ ? మే మందరం యెంత చదువుకున్నా మంచివాళ్ళంగానే వుంటాం. యెంత గొప్పవాళ్ళ మైనా మంచివాళ్ళంగానే వుంటాం. సరేనా ?

రంగడు: (సరేనని తల వూపును.)

జానకి: ఐతే మరి నువ్వూ చదువుకో. మాతోపాటే గొప్ప వానివి కావచ్చు. మాతోపాటే మంచివానిగా వుండ వచ్చు. సరేనా?

రంగడు: (సరేనని తల వూపును.)

జానకి: చదువుకుంటావ్ గదూ ?

రంగడు: (తల వూపుతూ) ఊఁ.

గోపీ: (ఉత్సాహంగా, చప్పట్లు కొట్టూ, పాటపాడును.)

రంగడు చదువుకుంటాడూ_
మా రంగడు చదువుకుంటాడూ_
జై_రంగనికీ జై (లేచి నిలబడి) అందరూ
జై అనండి _ రంగనికీ

గోపీ: | శంకర్: | జానకి: (ముగ్గురూ) జై (శంకర్, జానకీ, లేచి నిలబడుదురు)

శంకర్: మరి పోదామా యింక ?

గోపీ: (రంగని వైపు చూస్తూ) పోదాం లెయ్ రంగడూ యింక. (రంగడు లేవడు.)

జానకి: (రంగని వైపు చూసి, అసలు సంగతి జ్ఞాపకం వచ్చి, శంకర్ వైపు తిరిగి) వుండు శంకర్, యెక్కడ పోతావ్ అసలు సంగతి తేలంది ?

శంకర్: | గోపీ: | (ఏమిటి అన్నట్లు - ప్రశ్నార్థకంగా - జానకి వైపు చూస్తారు)

జానకి: రంగని సంగతి శంకర్ - రంగనికి అన్న మెవరు పెట్తారూ ?

గోపీ: ఔన్రోయ్ - రంగనికి అన్న మెట్లా ?

శంకర్: (ఆలోచిస్తూ) రంగనికి - అన్నమా ? (ముఖం చిట్లించి) యెట్లరా గోపీ ? యెట్ల జానకీ ? (తల గోక్కుంటూ) నా కేమి దిక్కు తెల్లేదు - నువ్వే చెప్పు.

గోపీ: (వికసించిన ముఖంతో) మా యింటికి పిల్చుక పోతాన్లే- మా యమ్మ అన్నం పెట్తాది.

శంకర్: (గోపీ ముఖంలోకి చూస్తూ, గంభీరంగా) మీ యమ్మా ? మీ యమ్మ పండ్లు రాల గొట్తాది.

రంగడు: (తన నేమో అనే భయంతో) అమ్మో - నే రానూ.

గోపీ: (రంగనికి యెదురుగా కూర్చొని, బుజ్జగిస్తూ) నిన్ను గాదులే రంగడూ-నన్నులే-మా యమ్మ పండ్లు రాలగొట్తేది నన్నులే.

జానకి: శంకర్, ఒకమాట చెప్తాను వింటావా? (సరేనని శంకర్ తల ఆడించును.) (గోపీ వైపు చూస్తూ) నువ్వూ విను గోప్పీ (గోపీ లేచి నిలబడును.) రంగని మా యింటికి పిల్చుక పోతాను. ఒక నెల అన్నం పెట్టమని మా యమ్మ నడుగుతాను. తరువాత ఒక నెల పెట్టమని (గోపీతో) మీ యమ్మ నడుగు. మళ్ల నెలలో నువ్ (శంకర్‌తో) మీ యమ్మ నడుగు. యేం సరేనా?

గోపీ: మళ్ల నెలలోనో?

జానకి: అప్పుడేదో వకటి చేస్తాంలే గోపీ_(శంకర్‌తో)సరేనా?

శంకర్: (కాదని తల వూపాను.)

జానకి: (ఆశ్చర్యంగా) యేం శంకర్? నామాట బాగలేదూ?

శంకర్: (దిగులుగా) మాయమ్మ వొప్పుకోదు. (గోపీని చూపిస్తూ) వాళ్ళమ్మ వొప్పుకోదు. మరి మీ యమ్మో? మీ యమ్మ వొప్పుకొంటుందా? నాకేమో నమ్మకం లేదు.

జానకి: (ఒక క్షణం దిగులుపడి, అంతలోనే ఉత్సాహం తెచ్చుకొని) అడుగుదాం శంకర్. గట్టిగ అడుగుదాం. యేమంటావ్ గోప్పీ?

గోపీ: (సరేనని తలవూపును.)

జానకి: నేను మాయమ్మ నడుగుతాను. మీరూ అడగండి. సరేనా?

గోపీ: | శంకర్: (సరేనని తల వూపుతారు)

జానకి: గట్టిగ అడుగుదాం_ఆశం పట్టి అడుగుదాం.

గోపీ:
శంకర్: (సరేనని తల వూపుతారు)

జానకి: రంగడికి అన్నం పెట్టకపోతే, అలుగుదాం.

గోపీ:
శంకర్: (సరేనని తల వూపుతారు)

జానకి: రంగడికి అన్నం పెట్టక పోతే, మనమూ తినవద్దు.

గోపీ:
శంకర్: (సరేనని తల వూపుతారు)

జానకి: పట్టుపడ్తే తప్పక గెలుస్తాం-యింకేం ? పోదామా ?

గోపీ: పోదాం పదండి.

శంకర్: పదండి (ఖాళీగ్లాసు తీసుకొని, రంగనితో) యిక్కడే వుండు రంగడూ, మేం మళ్ళీ యిప్పుడే వస్తాం.

గోపీ: (రంగనితో) జాన్ రంగడూ - నువ్విక్కడే వుండు - యెక్కడికీ పోవద్దు.

(ముగ్గురూ రెండడుగులు వేస్తారు.)

జానకి: (నిలబడి రంగనివైపు తిరిగి) యెక్కడికీ పోవుగదూ ? (పోనని రంగడు తల ఆడిస్తాడు.) యిక్కడే వుంటావ్ గదూ ? (వుంటానని రంగడు తల వూపును. ముగ్గురూ తిరిగి చూస్తూ, తిరిగి చూస్తూ, నిష్క్రమణ. ఒక అర్ధ నిముషం నిశ్శబ్దంగా గడచిన తర్వాత, flute గానీ, voilon గానీ, అస్పష్టంగా ఆరంభమై, క్రమంగా స్థాయి హెచ్చి, స్పష్టంగా వినపడును. అది వింటూ రంగడు కదలకుండా కూర్చొని వుండును. ఒక నిముషం ఐన తర్వాత full orchestraతో back-ground పాట వినపడును.)

యెంత మెత్తని మమతలో
అవి యెంత తీయని ప్రేమలో
చిన్నిపిల్లల పూవు ఎడదలలో
చిన్నారి పిల్లల యెడత మధువులలో
యెంత మెత్తని... ...
చిన్ని మనసుల తేట వెన్నెలలో
చిన్నారి మనసుల చలువ సోనలలో
యెంత మెత్తని... ...
బాల హృదయపు పాల సంద్రములో
పసిబాల హృదయపు అమృత భాండంలో
యెంత మెత్తని... ...
చిరుత ప్రాయపు చిలిపి వూహలలలో
చిన్నారి ప్రాయపు వెలుగు సీమలలో
యెంత మెత్తని మమతలో
అవి యెంత తీయని ప్రేమలో

(శంకర్ ముందూ, శంకర్ తండ్రి వెనుకా ప్రవేశం)

శంకర్: (వడివడిగా రంగని సమీపిస్తూ) యిడుగో నాన్నా, రంగ డిడుగో.

శంకర్ తండ్రి: (రంగిని సమీపించి) యెవరబ్బాయ్ నువ్వు?

రంగడు: (లేచి నిలబడి) రంగడు.

శం-తండ్రి: నీకు తల్లీ తండ్రీ లేరూ?

రంగడు: (లేరని తల వూపును.)

శం-తండ్రి: మీవాళ్లెవరూ లేరూ?

రంగడు: (లేదని తల వూపును.)

శం-తండ్రి: ఐతే యేం చెయ్యాలనుకున్నావ్ మరి?

శంకర్: అదే నాన్నా-మనింట్లో అన్నం పెట్దాం రంగనికి.

శం-తండ్రి: మనింట్లో పెడ్తే?

శంకర్: అన్నం తిని నాతో పాటే చదువుకుంటాడు.

శం-తండ్రి: (వెటకారంగా) చదువుకుంటాడు – యెందుకు చదువు కోడూ? అన్నంపెడ్తే అందరూ చదువుకుంటారు.

శంకర్: (వెటకారం అర్థంగాక-ఉత్సాహంగా) ఐతే రంగని పిల్చుక పోదామా నాన్నా మనింటికి?

శం-తండ్రి: (కోపంగా) నోరుముయ్ వెధవా–అందరికీ అన్నం పెట్ట డానికి మనిల్లేం ధర్మసత్ర మనుకున్నావా?

శంకర్: (ప్రార్థించే కంఠంతో) ఒక నెలే లే నాన్నా – ఒక నెల మనింట్లో వుంటాడులే నాన్నా!

శం-తండ్రి: (శంకర్ మీదికి చెయ్యెత్తి) మళ్ళీ అదే మాటా? (శంకర్ భయంతో ఒకడుగు వెనక్కు వేయును) ఒక నెల మాత్రం మనింట్లో యెందుకు పెట్టాం?

శంకర్: (జాలిగా) మరి రంగనికి అన్నమెట్ల నాన్నా?

శం-తండ్రి: అన్నమెట్లా – దేవున్నడగమను. మన కెందుకురా – రా పోదాం.

శంకర్: (యేడుపు మొగం పెట్టి) యెట్ల నాన్నా?

శం-తండ్రి: (గట్టిగా) ఛా వెధవా (శంకర్ చెయ్యి పట్టుకొని లాగుతూ) పోదాం రా. (యిద్దరూ నిష్క్రమణ

(మరొక వైపునుండి గోపీ, గోపీ తండ్రీ ప్రవేశం. ముందు తండ్రీ-వెనుక గోపీ.)

గోపీ: యిక్కడే నాన్నా-రంగడిక్కడే వున్నాడు, (రంగని చూపిస్తూ) ఆడుగో (రంగని సమీపించును.)

గో-తండ్రి: (రంగని సమీపించి) నువ్వేనా అబ్బాయ్ రంగనివి?

రంగడు: (ఔనని తల వూపును.)

గో-తండ్రి: ఐతే మావాన్తో నీకేం పనీ? (రంగడు పలకడు.)

గోపీ: అదికాదు నాన్నా-రంగనికి యెవరూ లేరు.

గో-తండ్రి: ఐతే?

గోపీ: రంగనికి అమ్మా నాయనా యెవరూ లేరు.

గో-తండ్రి: ఐతే నన్నేం చెయ్యమంటావ్ రా?

గోపీ: రంగని మనింటికి పిల్చుక పోదాం నాన్నా.

గో-తండ్రి: (కోపంగా) నోరుముయ్ గాడిదా. దిక్కులేని వెధవలందరికీ మనిల్లేనేం వుండేది?

గోపీ: (యేడ్పుగొంతుతో) మరి రంగనికి అన్న మెవరు పెట్తారు నాన్నా?

గో-తండ్రి: అన్నమూ-అడుక్కు తినమను. యెవన్నరా నువ్వడిగేదీ? దేశంలో అన్నం లేని వాళ్లందరికీ నువ్వేనేం అన్నం పెట్టేది? రా యింటికి పోదాం. ■

గోపీ: (గోముగా) మనింట్లో ఒక నెల పెట్టాం నాన్నా.

గో-తండ్రి: (కోపంగా) మళ్ళీ అదేకూంత కూస్తావా, గాడిదా-రా. పిల్ల గాడిదకు నీకెందుకురా యీ వేషాలన్నీ? రా పోదాం. (గోపీ చెయ్యి పట్టుకొని లాగుతూ నిష్క్రమణ. గోపీ కన్నీళ్ళు తుడుచుకుంటూ నిష్క్రమణ. రంగడు దిక్కులు చూస్తూ కూర్చొనును. హఠాత్తుగా Background పాట. పాట కొంత ఐన తర్వాత శంకర్ ప్రవేశించి రంగని ప్రక్కన కూర్చొనును. పాట మరికొంత ఐన తర్వాత గోపీ ప్రవేశించి శంకర్ ప్రక్కన కూర్చొనును. గోపీ తన ప్రయత్నం నిష్ఫలమైందని సైగ చేసి, శంకర్‌ను సైగలతోనే ప్రశ్నించును. శంకర్ సైగలతోనే తన ప్రయత్నంకూడా నిష్ఫలమైందని జవాబు చెప్పును.)

మానవత్వమే నశియించినదా
మానవాత్మయే మరణించినదా
మనిషి బ్రతుకులో నంచితనాలూ
మనిషి గుండెలో మమకారాలూ
ప్రేమా జాలీ మాయమైనవా
కనికర మన్నది కాలిపోయెనా
మానవత్వమే......

తల్లీ దండ్రీ లేని పిల్లలను
ఆదరించుటే అరుదై పోయెనె
అభమూ శుభమూ యెరుగని వారికి
కూడూ గుడ్డలే కరువై పోయెనె
మానవత్వమే......

చిన్ని కడుపుకే అన్నము కరువా
చిట్టి బ్రతుకులే పుడమికి బరువా
మానవ సంఘం అరణ్య మౌనా
మానవ హృదయం యెడారియేనా
మానవత్వమే... ...

లేత మనసులో ఆవేదనలా
పూత వయసులో ఆక్రందనలా
పాల గిన్నెలో హాలాహలమా
పూల వనములో దావానలమా
మానవత్వమే నశియించినదా
మానవాత్మయే మరణించినదా

(పాట ఐపోయిన తర్వాత జానకి తల్లి ముందూ, జానకి వెనుకా ప్రవేశం.)

జా-తల్లి: యింకా యెంత దూరవే?

జానకి: యిక్కన్నేమ్మా—అదుగో రంగడు (చూపును) శంకర్ గోపీ కూడా అదుగో.

తల్లి: (రంగని సమీపించి) ఏమి నాయనా, నువ్వేనా రంగనివి?

రంగడు: (ఔనని తల వూపును.)

తల్లి: నీకు తల్లి దండ్రీ యెవరూ లేరూ?

రంగడు: (లేరని తల వూపును.)

తల్లి: ఐతే నువ్ చెడిపోయిందిగాక వూర్లో పిల్లలందర్నీ చెడగొట్టున్నావా? (రంగడు పలుకుండా ఆమెవైపే చూస్తూ వుండును.)

గోపీ: (దురుసుగా) యేం చెడగొడ్తున్నాడూ!

తల్లి: (కోపంగా) చెడగొట్టడం గాకపోతే యేమిటిదంతా? దానికి దిక్కు లేకపోతే మా కొంపమీద పడమని చెప్పినారేం? అసలు యీ శంకరూ, నువ్వే మా జానకిని చెడగొట్తున్నారు.

గోపీ: (ధిక్కారంగా) మే మేం చెడగొట్టలేదు పో (ముఖం ప్రక్కకు తిప్పుకొనును)

శంకర్: (లేచి నిలబడి) జానకిని మేమేం చెడగొట్తున్నాం?

తల్లి: మీరు గాకపోతే యెవరు చెడగొట్టినట్లూ మరి? మా జానక్కి యిట్లా బుద్ధులెప్పుడూ లేవ్, మీ సవాసం తోనే యీ పాడు బుద్ధులన్నీ పట్టుబడినాయి.

జానకి: (గోముగా) వాళ్ళతో యేం లేమ్మా - రంగని సంగతి చెప్పవూ?

తల్లి: యేమిటే రంగని సంగతి చెప్పేది? రంగడూ లేడు, గింగడూ లేడు - పద యింటికి.

జానకి: (తల్లి చేయి లాగుతూ) అమ్మా - ఓమ్మా.

తల్లి: అబ్బ - యేమే?

జానకి: రంగని పిల్చుక పోదామమ్మా.

తల్లి: మళ్ళీ అదేమాటా? పిల్చుకపోతే యెవరే వండి పెట్టేది యీ తాడు తెగినోళ్ళ కందరికీ?

జానకి: ఒక్క నెలే లేమ్మా-తరువాత యింకోరింటికి పొమ్మం దాంలే.

తల్లి: నెలా లేదు-వారమూ లేదు. అసలు మీ నాన్నకు తెలిస్తే నీ చర్మం వొలుస్తాడు. యింకరా యింటికి,

జానకి: వుండమ్మా-రంగని కన్న మెట్లా మరి?

తల్లి: అబ్బ యిదేం పీడే పాడు పీడా! రంగడు రంగడు రంగడంటూ! యిట్లాటోళ్ళు యెంత మంది వున్నా రనుకున్నావో లోకంలో-వాళ్ళ కందరికీ మనమేనా అన్నం పెట్టేది?

గోపి: (ఆమె వైపు చూడకుండానే) ఆఁ-అందరికీ పెట్టేట్టుగానే వుంది ఈయమ్మ!

జానకి: అందరికీ, పెట్టొద్దులేమ్మా-రంగని కొక్కనికే లే.

తల్లి. వొక్కనికైతే మాత్రం-మనమేనా వుండేది?

జానకి: మనమే కాదులేమ్మా-ఒక్క నెల మనింట్లో వుంటాడు. మళ్ళ వొక్క నెల గోపీ యింట్లో వుంటాడు. తర్వాత శంకర్ యింట్లో వుంటాడు.

శంకర్: (తన ప్రయత్నం నెరవేరదని శంకర్ తల తిప్పుతాడు)

తల్లి: చూడవే పిచ్చి కుంకా చూడు.

జానకి: (ఆదుర్దాగా) యేం శంకర్?

శంకర్: మా నాన్న వొప్పుకోలా.

జానకి: గోపీయో?

శంకర్: గోపీ నాన్న కూడా వొప్పుకోలా.

తల్లి: (జానకి చెవి పట్టుకొని) సిగ్గొచ్చిందేమే యిప్పుడూ? యింక పోదాం రా.

జానకి: (దిగులుగా) రంగనికి యెట్లమ్మా యింక?

తల్లి: (జానకి చెవి వదలి పెట్టి - విసుగ్గా) దానికి నన్నేం చెయ్ మంటావే?

జానకి: అదిగాదమ్మా-రంగనికి అన్న మెవరు పెడ్తారూ అని.

తల్లి: యెవరైనా యెందుకు పెడ్తారూ - అడుక్కు తింటే తలా యింత పెడ్తారు.

జానకి: (జాలిగా) అడుక్కు తినమంటావా?

తల్లి: నే ననేదేముందే? ఆకలైతే వాడే అడుక్కుంటాడు.

రంగడు: (ఉట్టిపాటుగా లేచి నిలబడి) నేనే మడుక్కోను.

తల్లి: అడుక్కోవూ? అడుక్కోపోతే వస్తుందు-నాకేం?

గోపి: (లేచి నిలబడి) వస్తేందు కుంటాడూ? రంగడేం వస్తుండడు.

తల్లి: వస్తుండక యేం చేస్తాడూ? రోజూ నువ్ పెడ్తావా అన్నం? (గోపి తల దించుకొనును. ఎగతాళిగా) అదేమో చేతగాదు అబ్బాయిగారికి-జంబం మాత్రం వుంది గంపెడు. (జానకితో) యిక రావే పోదామూ.

జానకి: చెప్పమ్మా-రంగని సంగతి చెప్పవూ మరీ?

తల్లి: అబ్బ యేం పిల్లవే నువ్వూ! (రంగనివైపు చూస్తూ) వోరేయ్ రంగడూ-యెక్కడ దాపురించినావ్ రా నువ్ మాకూ.

రంగడు: నే నేం జేసినా?

తల్లి: యింకా చేసేదేముంది - నా తలకాయ. చేసేదంతా చేసి కూర్చున్నావు. నువు చెడిపోయేదేగాక వీళ్ళం దర్నీ చెడగొట్టున్నావు.

జానకి: రంగడు చెడిపోయినాడామ్మా?

తల్లి: ఆ - (చేతులు త్రిప్పుతూ) చెడిపోక వాడు బాగుపడే దేముంది యింకా!

జానకి: రంగని యెవరు చెడగొట్టినారమ్మా?

తల్లి: యెవరూ? వొకరు చెడగొట్టేదేమి - దేవుడే చెడగొట్టి నాడు.

గోపీ: (సందేహిస్తూ) ఆఁ - దేవుడు చెడగొట్టాడా?

జానకి: మనుషుల్ని చెడగొట్టేవాడు దేవుడెట్లా తాడమ్మా?

తల్లి: అబ్బ! యేం ప్రశ్నలే - చచ్చు ప్రశ్నలన్నీ - ఐనా వీధిలో నిలబడుకోని యేమిటీ వెధవ నాటకాలన్నీ? రా పోదాం.

జానకి: వుండమ్మా - రంగడు అడుక్కోకుండా యేదైనా ఉపాయం చెప్పు నుకి.

తల్లి: అబ్బ బ్బబ్బబ్బ! నా గొంతుకు వురిపెట్టుకున్నట్లుందిరా భగవంతుడా! - నే నేం వుపాయం చెప్పేదే? పోనీ - యెక్కడైనా పని చేసుకొమ్మను.

జానకి: యేం పనీ?

తల్లి: యేం పనీ! జిల్లాకలెక్టర్ పనిచేయ్యమను — నే నొద్ద న్నానా?

జానకి: అబ్బ! సరిగ్గా చెప్పమ్మా.

తల్లి: సరిగ్గా యేముందే? యెవరింట్లోయినా నౌకర్గా వుండమను.

(ఒకక్షణం నిశ్శబ్దం. జానకి, గోపీ, శకంర్ వైపు చూస్తారు. శంకర్ రంగని వైపు చూస్తాడు.)

జానకి: (రంగని వైపు తిరిగి) యెట్ల రంగడూ?

రంగడు: (ఒక క్షణం ఆలోచించి, మెల్లగా తల తిప్పుతూ) సరేలే, నౌకర్గానే వుంటాను.

గోపీ: యెక్కడా?

శంకర్: యెవరింట్లో?

జానకి: (తల్లివైపు చూస్తూ) మనింట్లో వుంటాడు లేమ్మా నౌకర్గా.

తల్లి: యేమిటీ? మనింట్లోనా? యేచ్చినట్లే వుంది మీ సరసం. మనకేమొద్దు — యెక్కడన్నా యేగమను.

జానకి: యేమమ్మా — మనింట్లోనే వున్నీ లేమ్మా.

తల్లి: నువ్వెక్కడి పిల్లవే! నీకేం మతి చెడిందా? మన కెందుకూ నౌకరు?

జానకి: మరి యెట్లమ్మా? రంగనికి పని దొరక్కపోతే యెట్లా?

తల్లి: దాని నన్నేం చేయ్యమంటావు? యెక్కడైనా పడి చావను — నాకేం?

జానకి: (మెల్లగా, విచారంగా) అంతేనా ?

తల్లి: (గద్దిస్తూ) జానకీ (జానకి చేయి పట్టుకొని) మర్యాదగా వస్తావా రావా? (చేయి విడిపించుకొని, జానకి రెండడుగులు వెనక్కు వేసి నిలబడును) వుండు యిక్కన్నే-కడుపులో కాలినప్పుడు నువ్వే వస్తావ్. (చరచరా నిష్క్రమించును) (అందరూ ఆమె పోయిన వైపే చూస్తూ వుందురు. కొన్ని క్షణాలు నిశ్శబ్దం.)

శంకర్: (జానకి వైపు చూస్తూ) జానకీ యింకెట్లా ?

జానకి: ఆఁ- (ఆలోచిస్తూ వుండును.)

గోపీ: రంగడూ, నువ్ పనిచేస్తానన్నావ్ గా ?

శంకర్: (గోపీ వైపు చూస్తూ) ఐతే?

రంగడు: పని యెక్కడుందీ ?

గోపీ: మరి చేస్తానంటివే ?

రంగడు: వుంటే చేస్తానన్నాను.

గోపీ: ఐతే యెవరైనా అడుగుదాం పని యిమ్మని. (శంకర్ తో) యేం శంకర్ ?

శంకర్: ఔ జానకీ ?

జానకి: (అంతవరకూ పరధ్యానంగా వుండి, శంకర్ వైపు తిరిగి) యేమిటీ ?

శంకర్: యెవరైనా అడుగుదాం, రంగనికి పని యిమ్మని.

జానకి: యెవర్ని ?

శంకర్: యెవర్నో-అందర్నీ అడుగుదాం.

గోపీ: అందర్నీ అడుగుతే యెవరో ఒకరు యిస్తారు.

జానకి: యెందుకిస్తారూ? యెవరూ యివ్వరు.

గోపీ: యివ్వకపోతే యెట్ల జానకీ?_యిస్తార్లే.

జానకి: (విచారంగా తల తిప్పుతూ) యిస్తారు - బాగిస్తారు. (గోపీతో) రంగనికి అన్నం పెట్టమంటే మీ యమ్మా నాన్నా యేమన్నారో చెప్పు.

గోపీ: మా నాన్న వీపు వాయ గొట్టినాడు.

జానకి: (శంకర్‌తో) మీ నాన్నో?

శంకర్: చెంపలు పగల గొట్టినాడు.

జానకి: యింకేం? యింకా చాల్లేదా?

శంకర్: (అర్థంగాక అయోమయంగా జానకి వైపు చూచును.)

జానకి. నీకు గోపీ_నీ వీపుకు యింకా కావాల్నా?

గోపీ: (వద్దని తల ఆడించును.)

జానకి: వీపు నిండిందన్నమాట. వీపు నిండకుండా వుంటే మీ నాన్న నడుగు - రంగనికి పని యిమ్మని. (శంకర్‌తో) నీకూ అంతే_చెంపలు నిండకుండా వుంటే మీనాన్ననడుగు_రంగనికి పని యిమ్మని.

రంగడు: మరి యెట్ల జానకీ యింక?

జానకి: పని సంగతి వదలి పెట్టి అవతలి సంగతి ఆలోచించు.

శంకర్: ఆదిగాదు జానకీ_మన నాన్నగారి నడగొద్దనే పని యిమ్మని-వూర్లో వాళ్ళనడుగుదాం.

జానకి: మన నాన్నగారు యిచ్చిన కొదవా సదవా వూళ్లో వాళ్ళు యిస్తారు. అదేం లాభంలేదులే.

శంకర్: మరియెట్లా జానకీ యింక ?

గోపీ: (విసుగ్గా) యేమి జానకో—యేదీ తెగనివ్వదు.

రంగడు: పోనీలే జానకీ—పని యిమ్మని అందర్నీ అడుగుదాం. యెవరూ యివ్వకపోతే అప్పుడు చూస్తాంలే.

జానకి: యేమొద్దులే.

రంగడు: (విసుగ్గా) యెట్లా జానకీ మరీ ? నాకు అన్న మెట్లా ?

జానకి: చెప్తా నుండు రంగడూ — కొంచెం సేపుండు. (ఆలోచించును)

గోపీ: నువ్ చెప్పేటప్పటికి కోళ్లు కూస్తాయ్ లే ( కూర్చొనును)

శంకర్: లెయ్ గోపీ. కూర్చుంటే యెట్లా ?

జానకి: (వాళ్లవైపు చూస్తూ) ఆఁ—వినండి మరి, యేం గోపీ, కూర్చున్నావ్ ? లెయ్ లెయ్.

గోపీ: అబ్బ—అప్పుడేనా ? (లేస్తూ) ఆలోచన ఐపోయిందా ?

జానకి: నేచెప్పినట్లు వింటారా ? (వింటామని ముగ్గురు తల లాడిస్తారు) వినండి మరి. యిప్పుడు రంగనికి యేం కావాల ?

గోపీ: పని.

రంగడు: ఔను—పని కావాల నాకు.

జానకి: పనీ ? పనెందుకూ ?

రంగడు: పని లేకపోతే అన్న మెవరు పెట్తారూ ?

జానకి: ఆఁ_అదీ! నీకాౕవలసింది పనికాదు – అన్నం. అంతేనా ?

గోపీ: అదేం మాట జానకీ? అన్నం వూరక యెట్లొస్తుందీ ?

శంకర్: వుండరా గోపీ_జానకిని చెప్పనీరాదూ.

గోపీ: ఆఁ ఆఁ_చెప్పు జానకీ, చెప్పు_రంగనికి కావలసింది అన్నం.

జానకి: మరి రంగనికి కావలసింది వృత్త అన్నమేనా ?

గోపీ: (అర్థంకాక) అంటే ?

శంకర్: యేమిటి జానకీ ? సగా చెప్పు.

జానకి: విను_రంగనికి కావలసింది వృత్త అన్నమైతే హాయిగా అడుక్కు_తినొచ్చు.

గోపీ: ఛూ_ఆ మాటేనా నువ్ చెప్పేది ?

రంగడు: ఐతే నన్ను అడుక్కు– తినమంటావా జానకీ ?

జానకి: అబ్బ! మీకు అర్థమే కాదు రంగడూ. నీకు చెప్తాను విను శంకర్.

జానకి: సరేలే చెప్పు.

జానకి: మన కందరికీ కావలసింది వృత్త అన్నమే ఐతే హాయిగా అడుక్కు– తినొచ్చు. సరేనా?

శంకర్: యేమిసరో?నాకే మర్థం కాలేదు.

జానకి: అబ్బ ? అదిగాదు శంకర్. నువ్వే వున్నావనుకో– నీకాౕవలసింది అన్నమే ఐతే నువ్వెందుకు అడుక్కో– కూడదూ ?

గోపీ: శంకర్ అడుక్కుంటే వాళ్ళనాన్న వూరుకుంటాడా? వాని తోలు తీసి డోలు కడ్తాడు,

శంకర్: (గోపీతో) నువ్వడుక్కుంటే నీతోలు తియ్యడో మీ నాన్న?

జానకి: (గోపీతో విసుగ్గా) యేం గోపీ - నీ తోళ్ళూ డోళ్ళూ యిప్పుడేనా? (శంకర్‌తో) చెప్పు శంకర్ - నువ్వెందు కడుక్కోవో చెప్పు. (శంకర్ పలకడు) పోనీ మీ నాన్న యెందు కడుక్కోడో చెప్పు (శంకర్ పలకడు. గోపీతో) నువ్ చెప్పు గోపీ - మీ అమ్మా నాన్నా యెందు కడుక్కోరూ?

గోపీ: ఛూ - అడుక్కుంటారా యెవరైనా? అడుక్కోడా నికి సిగ్గు కాదూ?

జానకి: ఆఁ - అడుక్కోడానికి సిగ్గౌతుందన్నమాట. యేం శంకర్ - సరేనా?

శంకర్: సరేలే - చెప్పు.

జానకి: మరి సిగ్గెందు కౌతుందీ? మంచిపనిచేస్తే సిగ్గౌతుందా యెవరికైనా?

శంకర్: మంచి పనిచేస్తే సిగ్గెందు కౌతుందీ?

జానకి: చెడ్డపని చేస్తేనే సిగ్గయ్యేది - సరేనా?

శంకర్: గోపీ: (సరేనని యిద్దరూ తలలు వూపుతారు.)

జానకి: అంటే అడుక్కోడం చెడ్డపని అన్నమాట.

శంకర్: యిప్పుడు అడుక్కోమని యెవరన్నారూ? యేమిటో త్వరగా చెప్పు జానకీ.

జానకి: సరే విను. రంగనికి వుత్త అన్నమే కావాలంటే అడుక్కోవచ్చు. చెడ్డపని చెయ్యకుండా అన్నం కావాలంటే యెక్కడైనా పనిచేసుకోవచ్చు. అంతే గదూ?

శంకర్: అంతే.

జానకి: (గోపితో) అంతేనా గోపీ?

గోపీ: అంతే.

జానకి: (రంగనితో) అంతేనా రంగడూ?

రంగడు: అంతేలే. యింతకూ నన్ను అడుక్కోమంటావా, పని చేసుకొమ్మంటావా, యేదో వొకటి చెప్పు.

జానకి: వినండి మరి. అడుక్కున్నా, పనిచేసుకున్నా, అసలు విషయం యెగిరిపోతుంది.

శంకర్: అసలు విషయ మేమిటి?

జానకి: అసలు విషయమే నువ్ మరచి పొయ్‌నావ్. నువ్వూ మరచిపొయ్‌నావా గోపీ?

గోపీ: నువ్వే చప్పరాదూ త్వరగా?

జానకి: మొదట మనం అనుకున్న దేమిటి? రంగడు చదువు కోవాలనిగదూ? ఆ సంగతే మీరు మరచిపొయ్‌నారు చూడు.

గోపీ: (శంకర్‌తో) జౌన్‌రోయ్ — రంగడు చదువుకోవద్దూ?

శంకర్: సౌన్ జానకీ - ఆ సంగతే మరచి పోయ్నాం.

రంగడు: ఐతే అన్నం లేకుండా చదువుకొమ్మంటారా నన్ను?

గోపీ: వుండు రంగడూ-ఆ సంగతేకదూ మేం మాట్లాడేది ?

జానకి: చదువుకోవాలంటే-బడికిరా చదువు చెప్తామంటారు. మరి అన్నలేంది రంగడు బడికెల్లి పోత్రాడూ ?

శంకర్: యిప్పుడదేగదా అసలు ప్రశ్న.

జానకి: అన్నం పెట్టమంటే అడుక్కు-తినమంటారు. లేకుంటే పని చేసుకొమ్మంటారు. అడుక్కు-న్నా, పని చేసుకున్నా, అన్నం వస్తుందిగానీ చదువురాదు. చదువుకోవాలంటే అన్నం లేదు. మరి రంగనికి అన్నమూ కావాల, చదువూ కావాల-అంతేకదూ ?

గోపీ: చదువు రాకపోతేయేం?

శంకర్: నువ్ మళ్ళీ మొదటికొచ్చినావేంరా గోపీ? చదువుకోడానికి రంగని అప్పుడే వొప్పించినాంలే.

జానకి: గోపీ, యిటుచూడు. గాడిదనూ, గుర్రాన్నీ చూసినావా నువ్వు ?

గోపీ: (ఉత్సాహంగా) ఓ! (తల తిప్పును)

జానకి: కుక్కనూ, పిల్లినీ చూసినావా ?

గోపీ: (పై విధంగానే) ఓ!

జానకి: చదువుకోకపోతే నువ్వూ అంతే,

గోపీ: ఆఁ (ఆశ్చర్యంతో నోరు తెరచును)

జానకి: గాడిదా, గుర్రం, కుక్కా, పిల్లీ యెప్పుడూ బడికి పోవు, తెల్సునా ?

గోపి: (తల తిప్పుతూ, మెల్లగా) తెలుసు.

జానకి: బడికి పోకపోతే మనమూ అంతే. యెన్నాళ్లున్నా జంతువుల మాదిరే వుంటాం.

శంకర్: వాటిలో నేంలే జానకీ_చెప్పు. రంగనికి అన్నమూ చదువూ రెండూ కావాల. అవతల ?

జానకి: కాబట్టి మనం వుత్త అన్నం అడగొద్దు. వుత్త చదువూ అడగొద్దు. రెండూ అడుగుదాం.

రంగడు: వుత్త అన్నం అడిగితేనే వాళ్ళకు చెంపలూ, వీపులూ వాగినాయ్. యిక రెండూ అడిగితే___

గోపి: వొళ్ళంతా వాగుతుంది.

శంకర్: (అనుమానంగా) రెండూ కావాలని యెవర్నడుగుదాం?

జానకి: అందర్నీ. పని కావాలంటే అందర్నీ అడగొద్దూ? అట్లనే అన్నమూ, చదువూ కావాలని అందర్నీ అడుగుదాం.

గోపి: సరే అడుగుదాం. పదండి మరి.

రంగడు: గోపీ, ఒకసారి దెబ్బల్ తిన్నావు. యింకా చాల్లేదా?

జానకి: నువ్వుండు రంగడూ. నేన్ చెప్పినట్లు వినండి. మీరంతా. మనం పోయ్ అడుగుతే మళ్లీ తంతారు. మనం యిక్కన్నే కూర్చుందాం.

శంకర్: యిక్కడ కూర్చుంటే యేం లాభం ?

జానకి: యిక్కడ కూర్చుంటే మనమాట గెలుస్తుంది.యింటికి పోతే ఒక్కొక్కర్నే ఎముకలు విరగ్గొడతారు. అంద రమూ యిక్కన్నే కూర్చుంటే మన పెద్దవాళ్లు మన మాట తప్పక వింటారు.

గోపీ: మనమాట వినకపోతే మనం యింటికేపోవద్దు. అంతేగదు జానకీ!

జానకి: అంతే — మనమందరమూ పట్టుదలగా వుండాల.

శంకర్: ఐతే మనతోడు యింకా నలుగురుంటే మేలు గదూ?

గోపీ: ఔను జానకీ — వూర్లో పిల్లలందరమూ కలిస్తే మన మాట తప్పక గెలుస్తుంది.

జానకి: నిజమే — మీరు పోయ్ అందర్నీ పిల్చుకరాండి మరి.

గోపీ: పోదాంలెయ్ శంకర్.

(శంకర్, గోపీ, చెరొక వైపు నిష్క్రమణ)

రంగడు: జానకీ, యింతపని నెరవేర్తుం దంటావా?

జానకి: యెందుకు నెరవేరదూ? వూర్లో పిల్లలందరూ పట్టు బట్టితే పెద్దవాళ్ళు తప్పక వింటారు.

రంగడు: పెద్దవాళ్లు యేమీ చెయ్‌లేరంటావా?

జానకి: యెందుకు చెయ్‌లేరూ? పిల్లవాళ్లను యేడ్పిస్తారు. పిల్లవాళ్ళను యేడ్పించడానికేలే పెద్దవాళ్లు పుట్టిం దేది. యేడ్పించినా మనమంతా వొకటిగా వుంటే మన మాటే గెలుస్తుంది.

రంగడు: యేమో జానకీ - నాకేమో నమ్మకం లేదు.

జానకి: తప్పకుండా గెలుస్తాం రంగడూ. నీవేం భయపడాకు, అంతకు గెలువకపోతే పోనీలే_మనది పొయ్యేదేమీ లేదుగా? గెలుస్తే మన వూర్లో బీదపిల్లలందఱికీ అన్నమూ, చదువూ రెండూ దొరుకుతాయ్.

రంగడు: సరే కానీ.

(ఒక వైపునుండి శంకర్, కొందరు పిల్లలు ప్రవేశం)

శంకర్: (ప్రవేశిస్తూ) జానకీ, గోపీ యింకా రాలేదా?

(మరొకవైపునుండి గోపీ, మరికొందరు పిల్లలు ప్రవేశం)

గోపీ: (ప్రవేశిస్తూ) వస్తున్నా శంకర్.

జానకి: గోపీ, అందర్నీ వర్సగా నిలబెట్టు.

(గోపీ, శంకర్, పిల్లలందరినీ వరుసగా నిలబెట్టుతారు. ఆ వరుస కంటె ముందు వరుసలో గోపీ, జానకి, రంగడూ, శంకర్ నిలబడుతారు. అందరూ ప్రేక్షకుల వైపు తిరిగి వుంటారు.)

అడుగుతున్నాం అడుగుతున్నాం
అడుగుతున్నా మ్మేం మడుగు తున్నాం
పెరుగుతున్న పిల్లలం చదువుతున్న బాలలం.
ఆకలైన పిల్లవాండ్ర కన్న మేల లేదటంచు
అడుగుతున్నా మ్మేం మడుగు తున్నాం
రేపు జగతి మాదియే భావి బ్రతుకు మాదియే
రేపు జగతి బ్రతుకు మేము కోరుతున్నాం

భావి బ్రతుకు సుఖము మేము కోరుతున్నాం
కోరుతున్నా మ్మేం కోరుతున్నాం
నేటి బాల బాలికల్ రేపు తరము నాయకుల్
నేటి చిన్నపిల్లలం భావి జగతి పౌరులం
కూడు గుడ్డ చదువు సంధ్య మాకు జన్మహక్కులూ
జన్మహక్కు కొరకు మేము పోరుతున్నాం
పోరుతున్నాం మ్మేం పోరుతున్నాం
కూడు గుడ్డ కొరకు మేము పోరితీరుతాం
చదువు సంధ్యకొరకు మేము పోరితీరుతాం
జన్మహక్కు కొరకు మేము పోరి తీరుతాం
మా సుఖాల కొరకు మేము పోరితీరుతాం
పోరి తీరుతాం పోరి తీరుతాం
పోరి తీరుతాం మ్మేం పోరి తీరుతాం

(పాట పూర్తియిన తర్వాత గోపీ తండ్రి ప్రవేశం)

గో-తండ్రి: యింకా యిక్కడే వున్నావా గోపీ? (గోపీని సమీపిస్తూ) పోదాంరా, పొద్దు పోయింది. (రానని గోపీ తలత్రిప్పును) రావూ? (కోపంగా) రా గాడిదా, మళ్లీ దెబ్బలు పడాల్నా? (చేయెత్తును. రంగడూ, జానకి, శంకర్ అడ్డం వస్తారు.) ఆఁ (ఆశ్చర్యంతో ఒకడుగు వెనక్కు వేయును.)

శం-తం: (ప్రవేశించి) శంకర్! యేం చేస్తున్నావురా యింకా? రా వెధవా, యింటికి రా. (రానని శంకర్ తల త్రిప్పును. తండ్రి కోపంగా చేయెత్తి శంకర్‌ను సమీపించును. మిగత

ముగ్గురు అడ్డం వస్తారు.) యేమిటిదంతా? (గోపీ తండ్రి ప్రక్కన నిలబడును.)

జా-తల్లి: (లోపలనుండే) జానకీ, ఓ జానకీ! (ప్రవేశించి) యిక రామ్మా - పోదాం రా యింటికి. (రానని జానకి తల త్రిప్పును.) రావే యెందుకేడిపిస్తావు నన్నిట్లా?

(యింకా కొందరు తల్లులూ, తండ్రులూ ప్రవేశం)

జానకి: నే నీరోజు యింటికి రాను.

శంకర్: నేనూ రాను.

గోపీ: నేనూ రాను.

(తక్కిన పిల్లలందరూ ఒకేసారి "నేనూరాను" అని అంటారు)

శం-తం: యేం రోగ మొచ్చిందిరా మీ కందరికీ వొకటే నాడు? యెందుకు రారూ?

జానకి: మా మాట నెరవేరిందాకా మే మెవ్వరమూ యిండ్లకు రాం.

గో-తం: యేం మాటా?

జానకి: మా మాట వింటామంటే చెప్తా.

జా-తల్లి: చెప్పవే చూస్తామూ - యేం మాటో.

జానకి: ఊఁహుఁ - మీ రందరూ ముందు వొప్పుకుంటా మంటే-తర్వాత చెప్తా.

శం-తం: చెప్పు జానకీ, వింటాంలే.

జానకి: అందరూ అనండి వింటామని.

(పెద్దవాళ్ళందరూ "వింటాం, వింటాం" అంటారు.)

జానకి: ఐతే వినండి. యీ వూళ్లో పిల్లలందర్నీ చదువుకొనే ట్లు చేయండి.

శం-తం: యెవరొద్దన్నారూ? అందరూ బడికిపోయ్ చదువు కోండి.

జానకి: వూరక బడికి పొమ్మంటే బీదవాళ్ళెట్ల పోతారూ?

శం-తం: బీదవాళ్ళయితే యేం? చదువు వుచితంగానే చెప్తు న్నారుగా?

జానకి: అన్నమే లేకపోతే బీదవాళ్లు బడికెట్లపోతారూ?

శం-తం: యేమిటమ్మాయి నువ్వనేదైతే?

జానకి: బీదవాళ్లుకూడా చదువుకోవలసిందేనా?

శం-తం: తప్పకుండా చదువుకోవలసిందే. అందుకేగా వుచి తంగా చదువు చెప్తున్నారూ?

జానకి: వుచితంగా చెప్పి యేం లాభం? అన్నంలేని పిల్లలను అడుక్కు తినమంటారే?

గో-తం: ఐతే నువ్వనే దేమిటి జానకీ?

జానకి: వూరో పిల్లలందరూ చదువుకోవాలంటే, బీద పిల్లలకు ముందు అన్నం పెట్టండి.

గో-తం: పెట్టకపోతే?

జానకి: పెట్టకపోతే పోండి. మేమూ యిండ్లకు రాం.

జా-తల్లి: అబ్బ! యేం రాకాసివి పుట్టినావే నాకూ!

(పిల్లలందరూ నిశ్శబ్దంగా వుంటారు. పెద్దవాళ్లు ఒకరి ముఖాలొకరు చూచుకొంటారు. తరువాత గుసగుసలు, మాట్లాడుకుంటారు. ఒక నిముషం ఐన తర్వాత)

శం-తం: జానకీ, అందరం వొప్పుకున్నాంలే. రేపు వూళ్లో పెద్దమనుషులందరమూ కలిసి మీరు చెప్పినట్లే యేర్పాటు చేస్తాంలే. సరేనా ?

జానకి: రేపట్నుండి బీద పిల్లలందరికీ వేళకు అన్నం పెట్తారు గదూ ?

శం-తం: పెట్తాం.

జానకి: పెట్తామని ప్రమాణం చెయ్యండి. దేవునితోడు అన్నం పెట్తామని అందరూ అనండి.

("దేవుని తోడు అన్నం పెట్తాం" అని అందరూ అంటారు.)

(తెర)

# I

# ప్రయోజనం

అచ్చు కాకముందే ఈ నాటిక చదివిన ఒక మిత్రుడు "మన దేశంలో మధ్యాహ్న భోజన కమిటీలు వున్నాయి; తెలుసునా ?" అన్నాడు. "కమిటీలు వున్నాయని తెలుసు - కానీ భోజనమో?" అన్నాను. మిత్రుడు నవ్వి వూరకుండినాడు.

ఇంతకూ యీ నాటకంలోని సమస్య మధ్యాహ్న భోజనం మాత్రమే కాదు. అది బీదపిల్లల జీవితాని కంతటికీ సంబంధించినది. పిల్లలందరూ తమ శక్తి సామర్థ్యాల కొలదీ విద్య అభ్యసించడానికీ, జ్ఞానం ఆర్జించడానికీ, తిండి గుడ్డల సమస్యలు అడ్డం రాకూడదు. అనేక శతాబ్దాల ఫలితంగా మానవజాతి అమోఘమైన విజ్ఞానాన్ని సృష్టించింది; అమూల్యమైన సంస్కృతిని నిర్మించింది. ఈ విజ్ఞానమూ, ఈ సంస్కృతీ, ధనవంతుల పిల్లలకు మాత్రమే పరిమితం కావాలనడం దారుణమైన అన్యాయం.

మన ప్రభుత్వాలు పబ్లిక్ లైబ్రరీలను ప్రోత్సహించడమూ, ప్రాథమిక పాఠశాలల్లోనూ, కొంతవరకు హైస్కూళ్లలోనూ, ఉచిత విద్య యివ్వడమూ, ఒక ఉద్దేశంతోనే - ప్రజలందరికీ విద్యా విజ్ఞానాలు ఉచితంగా అందుబాటులో వుండాలని. కానీ కూడు గుడ్డలే కరువైన పిల్లలకు ఉచిత విద్య యివ్వబోవడం అపహాస్యం - అమానుషమైన అపహాస్యం.

ఈ సమస్య దేశవ్యాప్తమైంది. కాబట్టి పరిష్కార ప్రయత్నాలుకూడా దేశవ్యాప్తంగానే వుండాల. ఉదారులైన

వ్యక్తుల వలన - వాళ్ళ ఔదార్యం యెంత గొప్పదైనా - యిది పరిష్కారం కాదు. ఈ సమస్యను సాంఘిక సమస్యగా గుర్తించి, మొత్తం సంఘమంతా పూనుకున్నప్పుడే యిది పరిష్కార మౌతుంది. అంటే ప్రభుత్వమూ, ముఖ్యంగా మునిసిపాలిటీలూ, గ్రామ పంచాయితీలూ, ఈ సమస్యా పరిష్కారం తమ ముఖ్య కర్తవ్యంగా యెంచినప్పుడు.

దరిద్రులను విద్యావంతులను చేయడంలో న్యాయంగా పరోపకారంగూడా యేమీ లేదు. నూటికి 90 మంది నిరక్షరాస్యులున్న దేశంలో తక్కిన పదిమంది అక్షరాస్యులు మాత్రం అనుభవించేదేమిటి? నూటికి 99 మంది అజ్ఞానులున్న సంఘంలో తక్కిన ఒక్క విజ్ఞానీ సుఖపడేదేమిటి? అందరూ విద్యావంతులైనప్పుడే, అందరూ విజ్ఞానవంతులైనప్పుడే, విద్యా విజ్ఞానాల వలని ప్రయోజనాలు అందరూ పొందగలరు.

ఇది ప్రజాస్వామ్య యుగం. అంటే దేశంలోని ఆర్థిక రాజకీయ సాంఘిక వ్యవస్థలన్నీ అధిక సంఖ్యాకుల యిష్టానిష్టాల ప్రకారం నిర్మింపబడుతాయి. అంటే ప్రతియొక్కని సుఖమూ యీనాడు యితరుల వివేకంపైన ఆధారపడి వుంది. అందరూ విద్యావంతులైతే తప్ప యెవ్వరికీ సుఖంలేదు. సంఘమంతా సుఖపడాలంటే ప్రజలంతా విద్యావంతులు కావాలి. 'విద్యా విజ్ఞానాలు నేటి సాంఘిక అవసరం - ఒక ప్రాథమిక సాంఘిక అవసరం.

విద్యా విజ్ఞానాలు కొద్దిమంది ప్రత్యేక ఆస్తిగా వున్నంత ... ఆ ఆస్తి వారిని కూడా యేమీ సుఖపెట్టదు. తమ కోసమైనా వారా ఆస్తిని అందరికీ పంచిపెట్టాల. ప్రజ ... పంచుకునే కొలదీ ఆ ఆస్తి వృద్ధి అవుతుంది. పంచు ... వాళ్ళ సంఖ్య పెరిగేకొలదీ ఆ ఆస్తి విలువ పెరుగుతుంది.

అందుకనే దరిద్రులను విద్యావంతులను చేయడంలో ... రోపకారం యేమీ లేదనడం. విద్యాదానం అన్నమాటకు ... యీనాడు అర్థం లేదు – అందులో దానం యేమీ లేదు. ... ద్యా వ్యాప్తి మన అందరి అవసరం. మన అందరి సుఖం ... కొరకే అది మన అందరి కర్తవ్యం. అందుకనే అది మన ప్రభు ... త్వాలయొక్క, స్థానిక సంస్థలయొక్క ప్రధాన బాధ్యత.

నిరక్షరాస్యులైన పెద్దవాళ్ళ నందరినీ వెంటనే విద్యా ... వంతులను చేయడం సాధ్యం కాకపోవచ్చు. కనీసం పిల్లలనైనా ... అందరినీ విద్యావంతులను చేయడం అత్యావసరం. మన పిల్లలు ... మనకంటె సుఖపడాలంటే–వాళ్లు పెరిగి పెద్దవాళ్ళయ్యేనాటికి దేశంలో అవిద్య, అజ్ఞానం అంతరించి పోయేటట్లు చేయక ... తప్పదు. మన సంతానం కొరకు మనమామాత్రం ప్రయత్నం ... యలేమూ ?

———...———



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRWA101B105 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 24/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 55 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |